శ్రీ



# శ్యామలాదండకం

తెలుగు ప్రతిపదార్థంతో

...ఆచార్య తాడేపల్లి పతంజలి

## || ధ్యానమ్ ||

## ధ్యానము



**మాణిక్య వీణాముపలాలయన్తీం**
**మదాలసాం మఞ్జుల-వాగ్విలాసామ్ |**
**మాహేన్ద్రనీల-ద్యుతి-కోమలాఙ్గీమ్**
**మాతంగకన్యాం మనసా స్మరామి ॥౧॥**

*ప్రతిపదార్థం :*

| | |
|---|---|
| *మాణిక్యవీణాం* | రత్నాలు పొదిగిన వీణను, |
| *ఉపలాలయన్తీం* | మెల్లగా మీటుతూ, |
| *మదాలసాం* | ప్రశాంతమైన మైమరపుతో |
| *మఞ్జుల-వాగ్విలాసామ్* | చల్లని మాటల నేర్పరియై, |
| *మాహేన్ద్రనీల* | నీలమణిలాగా, |
| *ద్యుతి* | మెరుస్తున్న, |
| *కోమల+అఙ్గీమ్* | మృదువైన అవయవాలు కలదైన, |
| *మాతంగకన్యాం* | ఆ మతంగ ఋషి కుమార్తెను, |
| *మనసా స్మరామి* | నా మనస్సులో స్మరిస్తున్నాను! |

***విశేషాలు***

అమ్మవారు మతంగ మునికి కుమార్తెగా జన్మించింది. ( బ్రహ్మాండ పురాణం)

తొమ్మిదేండ్లకు బాలా త్రిపుర సుందరి. 11 ఏళ్ళకు లఘుశ్యామల. 16 ఏండ్ల కన్య శ్యామ. శ్యామల పదం నుంచి చామన చాయ అనే పదం వచ్చింది.

చతుర్భుజే చన్ద్రకలావతంసే
కుచోన్నతే కుఙ్కుమరాగశోణే |
పుణ్డ్రేక్షు-పాశాఙ్కుశ-పుష్పబాణ-
హస్తే నమస్తే జగదేకమాతః ||౨||

### ప్రతిపదార్థం

| | |
|---|---|
| చతుర్భుజే | ఓ నాలుగు భుజాల తల్లీ, |
| చన్ద్రకల+అవతంసే | కిరీటంపై చంద్రవంకను ధరించిన దానా ! |
| కుచ+ఉన్నతే | ఎత్తైన వక్షోజాలు కలదానా ! |
| కుఙ్కుమరాగశోణే | కుంకుమ వంటి ఎరుపు రంగు కలదానా ! |
| పుణ్డ్ర +ఇక్షు | చెరకు విల్లు, |
| పాశ | పాశము, |
| అఙ్కుశ | అంకుశము, |
| పుష్పబాణ | పుష్పబాణాలు |
| హస్తే | నీ చేతులలో ధరించిన దానా! |
| జగదేకమాతః | జగదేకమాతా! |
| నమస్తే | నీకు నమస్కారములు! |

మాతా మరకతశ్యామా

మాతఙ్గీ మధుశాలినీ ।

కుర్యాత్ కటాక్షం కల్యాణీ

కదంబవనవాసినీ || 3 ||

ప్రతిపదార్థం

మాతా తల్లీ !

మరకతశ్యామా మరకతమణి యొక్క నలుపుతో ఉన్న తల్లీ !

(చామన చాయతో ఉన్న తల్లీ !)

మాతఙ్గీ మతంగ ముని కూతురా !

మధుశాలినీ మధు స్వభావమున ( ఆనందస్వభావమున )

విరాజిల్లు దేవతా !

కల్యాణీ శుభములు కలిగించు తల్లీ !

కదంబవనవాసినీ కదంబ వృక్షపు వనమునందు నివసించు తల్లీ !

కటాక్షం కుర్యాత్ కటాక్షమును ప్రసరించు గాక !

**జయ మాతఙ్గతనయే**
**జయ నీలోత్పలద్యుతే |**
**జయ సంగీతరసికే**
**జయ లీలాశుకప్రియే** ॥ ౪ ॥

## ప్రతిపదార్థం

| | |
|---|---|
| *మాతఙ్గతనయే* | **ఓ మతంగ ముని కూతురా!** |
| *జయ* | **జయింపుము( ప్రకాశించుము)** |
| *నీలోత్పలద్యుతే* | **ఓ నల్ల కలువల ప్రకాశము కలదానా !** |
| *జయ* | **జయింపుము (ప్రకాశించుము)** |
| *సంగీతరసికే* | **ఓ సంగీతమును ఆనందించు త ల్లీ !** |
| *జయ* | **జయింపుము(ప్రకాశించుము)** |
| *లీలాశుకప్రియే* | **లీల కొరకు ఆడించు చేతిలోని చిలుకకు ప్రియమైన తల్లీ!** |
| *జయ* | **జయింపుము(ప్రకాశించుము)** |
| | (నా మనస్సులో సర్వోత్కృష్టముగా నిండి ఉండుము. కార్యసిద్ధిని కలిగించుము) |

## *జయ జనని!*

తల్లీ! జయింపుము( ప్రకాశింపుము)

## *దండకం :*

**సుధాసముద్రాన్తరుద్యన్మణిద్వీప-సంరూఢ-బిల్వాటవీమధ్య-**
**కల్పద్రుమాకల్ప-కాదమ్బకాన్తార-వాసప్రియే! కృత్తివాసప్రియే!**

ప్రతిపదార్థం

| | |
|---|---|
| *సుధాసముద్ర +అన్తః* | అమృతమనే సముద్రంలో, |
| *ఉ ద్యత్+ మ ణిద్వీప* | రత్నాలతో మెరుస్తున్న మణి ద్వీపంలో |
| *సంరూఢ* | పెరిగిన (నానా వృక్ష మహోద్యానవనమను ప్రథ మావరణలో ) |
| *బిల్వ +అటవీ మధ్య* | పెద్ద వయిన బిల్వ వృక్షాల (మారేదు చెట్ల) అరణ్యముల మధ్య |
| *కల్పద్రుమ+ ఆకల్ప* | కల్పవృక్షాలతో అలంకరించబడిన(అయిదు ఆవరణలలోని మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము అను కల్పవృక్షాలతో అలంకరించబడిన) |
| *కాదమ్బకాన్తార-వాసప్రియే* | కదంబ వృక్షముల దట్టమైన అరణ్యంలో (ఏడవ ఆవరణము) నివసించడానికి ఇష్టపడే ఓ తల్లీ ! |
| *కృత్తివాసప్రియే* | చర్మమే వస్త్రముగా కల శివుడు ప్రేమించే తల్లీ ! |

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

***విశేషాలు***

*సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే*
*మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే .*
*శివాऽకారే మంచే పరమశివపర్యంకనిలయాం*
*భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్*
*అను సౌందర్య లహరి శ్లోకం ఈ పాదం చదివిన వెంటనే గుర్తుకు వస్తుంది.*

## సాదరారబ్ధ-సంగీత-సంభావనా- -సంభ్రమాలోల-నీపస్రగాబద్ధ-
## చూలీసనాథత్రికే ! సానుమత్పుత్రికే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *సాదర+ ఆరబ్ధ-సంగీత-సంభావనా* | భక్తులపై ఆదరంతో ప్రారంభించిన గానము చేయు సంగీతాన్ని ఆస్వాదిస్తూ( వీణ మీటుతూ) |
| *సంభ్రమ+ ఆలోల* | నీ తల ఊపినప్పుడు, |
| *నీప స్రక్ +ఆబద్ధ* | కదిలే నీప పూల మాలలతో ( కడిమి పూల మాలలతో) చుట్టిన, |
| *చూలీసనాథత్రికే* | నితంబము వరకు వేలాడు కీల్జడ ( త్రిక) కలదానా ! *** |
| *సానుమత్ +పుత్రికే* | చరియలు కలిగిన హిమవత్పర్వతపు కుమార్తె అయిన ఓ తల్లీ! |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

****( మూలాధారం నుంచి సహస్రారం వరకు పాములా వ్యాపించిన కుండలినీ శక్తిలా జడ ఉన్నదని అంతరార్థం; చోలయతి భేదేపి పునః పునః ఉత్తిష్ఠతి=కత్తిరించినప్పటికిని పెరుగునవి కనుక వెంట్రుకలకు చూలమని పేరు)*

## శేఖరీభూత-శీతాంశురేఖా-మయూఖావలీబద్ధ- సుస్నిగ్ధ-
## నీలాలకశ్రేణి-శృంగారితే! లోకసంభావితే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *శేఖరీభూత* | సిగదండగా చేయబడిన (కిరీటముపై ఉన్న) |
| *శీత +అంశురేఖా* | చల్లని కిరణములు కల చంద్రుని యొక్క |
| *మయూఖ+ఆవలీబద్ధ* | చల్లని కిరణాలతో ప్రకాశిస్తూ, |
| *సుస్నిగ్ధ* | బాగా దట్టంగా ఉన్న ( తేమతో కూడిన) |
| *నీల+అలకశ్రేణి* | నల్లటి కురుల (ముంగురుల) వరుసతో |
| *శృంగారితే* | అందంగా అలంకరించబడిన ఓ తల్లీ ! |
| *లోకసంభావితే* | లోకులందరిచే పూజింపబడిన ఓ తల్లీ ! |

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

***విశేషాలు***

*ఘనస్నిగ్ధశ్లక్ష్ణం చికుర నికురుంబం తవ శివే (సౌందర్యలహరి)*

## కామలీలా-ధనుస్సన్నిభ- భ్రూలతాపుష్ప-సన్దోహ-
## సన్దేహకృల్లోచనే ! వాక్సుధా సేచనే !

### ప్రతిపదార్థం

| | |
|---|---|
| కామలీలా-ధ నుః +సన్ని భ | మన్మథుని ప్రేమ విల్లులా ఉన్న |
| భ్రూలతా | నీ లత వంటి కనుబొమ్మల నుండి |
| పుష్ప -సన్దోహ | వికసించిన పూల గుత్తులేమో |
| సన్దేహకృత్ | అను సందేహమును కలిగిస్తున్న |
| లోచనే | కన్నులు కలిగిన ఓ తల్లీ ! |
| వాక్+సుధా | అమృతము వంటి వాక్కుతో |
| సేచనే | తడుపు తల్లీ ! |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

### *విశేషాలు*

*నైష్ఠిక కర్మలను అనుసరించడంలో మంత్రోదకాన్ని చిలకరించడం,చల్లడం, తడపటం లాంటి క్రియలు ఉంటాయి. ఈ క్రియలకు సేచనలని పేరు. ఇందులో ప్రోక్షణం, అవోక్షణం, అభ్యుక్షణం అనేఅంగాలు ఉన్నాయి.*

*ప్రోక్షణం అంటే అర చేతిని వెల్లకిల ఉంచి శిరస్సు మీద నీళ్లు చల్లుకోవడం అనే క్రియ.*

*అవోక్షణం అంటే అరచేతిని నేల వైపు తిప్పి శుద్ధి కోసం మంత్రోదకాన్ని చిలకరించడం.*

*అభ్యుక్షణం (అభి + ఉక్షణం) అంటే యాగాలు చేయడం వంటి కార్యాలలో అరచేతిని సంపుటీకరించి జలాన్ని అడ్డంగా చల్లడమనే క్రియ. ఇలా మూడు అంగాలు సేచన ప్రక్రియలో ఉన్నాయి.*

## చారుగోరోచనాపఙ్క-కేలీలలామాభిరామే! సురామే! రమే!

### ప్రతిపదార్థం

*చారు* అందమైన

*గోరోచనాపఙ్క* పసుపు ఎరుపు రంగులు కలిగిన గోరోచన తిలకము కలిగిన నీ నుదుటితో ( కస్తూరి, గోరోచనము కలిపి తిలక ధారణ చేస్తారు)

*కేలీ లలామ+ అభిరామే* మధుర మనోహరత్వము కలిగిన ఓ తల్లీ...

*సురామే* భక్తులకు పరమ ప్రీతికరమైన ఓ తల్లీ !

*రమే* ఎల్లదిక్కులకు నడిమిచోటులో ఆనందించే తల్లీ ! (లక్ష్మీ స్వరూపిణీ! ....)

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

### *విశేషాలు*

*గోరోచనము = పశువుల పిత్తరసము నుండి తీయబడిన ఒకానొక పసుపు పచ్చని పదార్థము*

*చెక్కిళ్ళ వర్ణన*

## ప్రోల్లసద్వాలికా-మౌక్తికశ్రేణికా- చన్ద్రికామణ్డలోద్భాసి-లావణ్య-గణ్డస్థలన్యస్త- కస్తూరికాపత్రరేఖా-సముద్భూత-సౌరభ్య- సంభ్రాన్త-భృఙ్గాంగనా గీత-సాన్ద్రీ భవన్మన్ద్ర తన్త్రీస్వరే ! సుస్వరే ! భాస్వరే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *చన్ద్రికామణ్డల +ఉద్భాసి* | చంద్రబింబముల వరుసలా మెరుస్తున్న |
| *ప్ర+ఉల్లసత్ వాలికా మౌక్తికశ్రేణికా* | చక్కని కాంతి కలిగిన( గొప్పగా ప్రకాశిస్తున్న) దీర్ఘమైన ముత్యాల వరుసల వెలుగులో ప్రకాశిస్తున్న |
| *లావణ్య-గణ్డస్థలన్యస్త* | నీ అందమైన బుగ్గలపై అలంకరింపబడిన |
| *కస్తూరికాపత్రరేఖాసముద్భూత* | కస్తూరి రేఖల నుండి వెలువడే సువాసనకు |
| *సంభ్రాన్త-భృఙ్గాంగనా గీత* | ఆకర్షింపబడి దగ్గరికి వచ్చు ఆడు తుమ్మెదలు పాడు నాదములవంటి ( నాదములతో కలిసిపోయిన) |
| *సాన్ద్రీభవత్ +* | సున్నితమైన ( మెత్తనయిన) |
| *మన్ద్ర* | గంభీరమైన స్వరముకలిగిన |
| *తన్త్రీస్వరే* | వీణ తీగల ధ్వనులను పలికించే దేవీ ! |
| *సుస్వరే* | అందమైన స్వరములు కలిగిన తల్లీ! |
| *భాస్వరే* | ప్రకాశించు స్వభావము కలిగిన తల్లీ ! |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

## వల్లకీవాదన-ప్రక్రియాలోల- తాలీదలాబద్ధ-
## తాటఙ్కభూషావిశేషాన్వితే ! సిద్ధసమ్మానితే !

ప్రతిపదార్థం

| | |
|---|---|
| *వల్లకీవాదన* | నీ వీణను మ్రోగించే |
| *ప్రక్రియాలోల* | ప్రక్రియకు లయబద్ధంగా ఊగుతున్న |
| *తాలీదల+ ఆబద్ధ* | తాటి ఆకుల( చెవి కమ్మల) లేత రెమ్మలతోపొదిగిన ( నిర్మించబడిన) |
| *తాటఙ్కభూషావిశేష+అన్వితే* | చెవిపోగులతో అలంకరింపబడిన ఓ దేవీ ! |
| *సిద్ధసమ్మానితే* | సిద్ధులచే పూజింపబడే ఓ దేవతా ! |

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

**దివ్యహాలా-మదోద్వేల-హేలాలసచ్చక్షురాన్దోలన-**
**శ్రీ-సమాక్షిప్త-కర్ణైకనీలోత్పలే! నిర్మలే!**
**పూరితాశేషలోకాభివాఞ్ఛా ఫలే! శ్రీఫలే!**

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *దివ్యహాలా మద* | దివ్యమైన సోమరసాన్ని (బ్రహ్మానంద మధువును) సేవించిన సంతోషముతో |
| *ఉద్వేలహేలా* | విజృంభించిన సొగసు మీరిన విలాసముతో |
| *లసత్* | ప్రకాశమానమైన |
| *చక్షుః* | నీ కన్నులు |
| *ఆన్దోలన* | ఊగుతుండగా- వాటిచేత |
| *శ్రీ సమాక్షిప్త* | శోభను సమకూర్చుకొని (శ్రీకారములాంటి చెవులని కావ్య మర్యాద) |
| *కర్ణైకనీలోత్పలే* | చెవిని అలంకరిస్తున్న నల్లకలువలు కలిగినదానా ! |
| | (సోమరసాన్ని పీల్చడం వల్ల కలిగే మత్తు కారణంగా అలరారే అమ్మవారి కన్నుల అందం, ఆమె చెవులలో ధరించే నీలి కలువ యొక్క అందాన్ని అధిగమించింది) |
| *నిర్మలే* | పవిత్రమైన తల్లీ ! |
| *పూరిత +అశేషలోక+ అభివాఞ్ఛా ఫలే* | ఈ ప్రపంచంలోని ప్రతి జీవి కోరికలన్నింటినీ తీర్చే ఓ దేవతా! |
| *శ్రీఫలే* | శుభ ఫలములనిచ్చే ఓ తల్లీ ! |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

***విశేషాలు***

*చండీ సప్తశతిలో మహిషాసుర రాక్ష స సంహారమప్పుడు "" మధు యావత్ పిబామ్యహం ""*
*అని అమ్మ వారి మాటలు. నా చేతిలో ఉన్న మధువును తాగేంత వరకే నీ గర్జన*

## స్వేదబిన్దూల్లసత్-ఫాలలావణ్య- నిష్యన్ద-సన్దోహ-
## సన్దేహకృన్నాసికామౌక్తికే ! సర్వ విశ్వాత్మికే
## సర్వమన్త్రాత్మికే ! సర్వసిద్ధ్యాత్మికే ! కాలికే !

ప్రతిపదార్థం

| | |
|---|---|
| *స్వేదబిన్దు +ఉ ల్లసత్* | చెమట బిందువులతో ఉల్లసిల్లుచున్న |
| *ఫాలలావణ్య-* | నీ అందమైన నుదుటి ( రాతి ఉప్పులోని నిగనిగలాడే నునుపుతనం) |
| *నిష్యన్ద-సన్దోహ* | పైనుండి జారుతున్న చెమట బిందువులు ముత్యాల సమూహము |
| *-సన్దేహకృత్* | అన్నట్లున్న ( అను సందేహమును కలిగిస్తుంటే ) |
| *నాసికామౌక్తికే* | నాసికా ముత్యము(బులాకీ) కలిగినదానా ! |
| *సర్వమన్త్ర+ఆత్మి కే* | అన్ని మంత్రముల స్వభావమూ నీవే అయిన తల్లీ ! |
| *సర్వసిద్ధ్య +ఆత్మి కే* | అన్ని సిద్ధుల స్వభావమూ నీవే అయిన తల్లీ ! |
| *కాలికే* | ఈ సృష్టిలోని విస్తారమైన నియమస్వరూపిణియైన కాల రూపిణీ ! (కళలు అనగా విద్యలు కనుక విద్యా స్వరూపిణీ అని మరొక అర్థం) |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

**ముగ్ధ కున్ద మన్దస్మితోదార- వక్త్రస్ఫురత్-**
**పూగకర్పూరతాంబూలఖణ్డోత్కరేజ్ఞానముద్రాకరే !**
**సర్వసమ్పత్కరేపద్మభాస్వత్కరే ! శ్రీకరే !**

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *కున్ద మన్దస్మిత + ఉదార స్మిత* | మొల్లపూవుల వంటి పలువరుసతో నీ ముఖముపై ఉదారమైన చిరునవ్వును కలిగి |
| *వక్త్ర* | ఆ ముఖమునందు |
| *స్ఫురత్* | ప్రకాశించు |
| *పూగ* | వక్క, (దీనితో ముఖము పవిత్రమగును ) |
| *క ర్పూరతాంబూలఖణ్డ* | కర్పూర ఖండాలు ఇమిడిన తమలపాకుల తాంబూలపు |
| *ఉత్కరే* | సమూహాన్ని ఆస్వాదిస్తున్న తల్లీ ! |
| *జ్ఞానముద్రాకరే* | చేత జ్ఞాన ముద్రను ధరించిన తల్లీ ! |
| *సర్వసమ్పత్కరే* | సకల సంపత్తులనూ ప్రసాదించే ఓ దేవతా ! |
| *పద్మ భాస్వత్కరే* | తామరపువ్వులా ప్రకాశించే చేతులు కలిగినదానా! |
| *శ్రీకరే* | సిరులను కలిగించుతల్లీ ! |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

విశేషాలు ***విశేషాలు***

*జ్ఞాన ముద్ర అనగా చిన్ముద్ర. బొటన వ్రేలు, చూపుడు వ్రేలు కలిపిన ఒక ముద్ర.*

# కున్దపుష్పద్యుత్తి-స్నిగ్ధదన్తావలీ
# నిర్మలాలోలకల్లోల సమ్మేలన-
# స్మేర శోణాధరే ! చారువీణాధరే ! పక్వబింబాధరే !

ప్రతిపదార్థం

| | |
|---|---|
| కున్దపుష్పద్యుతి | మల్లె మొగ్గల మెరుపుతో |
| స్నిగ్ధ | నునుపు గలిగిన (తడిబారిన,తెల్లగా ఉన్న) |
| దన్త+ఆవలీ- | నీ పలువరుస(చక్కగా ఉన్నది. అందువలన) |
| నిర్మల | స్వచ్ఛమైన |
| ఆలోల | కదులుతున్న తెల్లని |
| కల్లోల | తరంగము ( లా నీ నవ్వు ఉన్నది) |
| సమ్మేలన | (అది ఎర్రని తాంబూలముతో) బాగా కలియుచున్నది. |
| స్మేర | అటువంటి తెల్లని చిరునవ్వులు కలిగిన |
| శోణ+అధరే | ఎర్రని కిందిపెదవి కలదానా ! (అమ్మవారి పలువరుసలలోని స్వచ్ఛమైన తెల్లదనం, ఎర్రని పెదవి పై ఏర్పడిన చిరునవ్వుల ఎర్రదనంతో బాగా కలిసిపోయిందని భావం) |
| చారువీణాధరే | అందమైన వీణను చేత ధరించినదానా! |
| పక్వబింబ+అధరే | పండిన దొండపండులాంటి పెదవులు కలిగిన ఓ దేవతా ! |

**జయ !** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

## సులలిత-నవయౌవనారంభ-చన్ద్రోదయోద్వేల- లావణ్య-
## దుగ్ధార్ణవావిర్భవత్-కంబుబింబోకభృత్-కన్ధరే !
## సత్కలామన్దిరే ! మన్థరే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *సులలిత* | నీ అందమయిన |
| *నవయౌవన+ఆరంభ* | నూతన యవ్వన ప్రారంభమను |
| *చన్ద్ర+ఉదయ* | చంద్రుడు ఉదయించగానే |
| *ఉద్వేల* | ఉత్సాహముతో తీరమును దాటిన |
| *లావణ్య* | నీ అందము అనే |
| *దుగ్ధ+ఆర్ణవ+ఆవిర్భవత్* | పాల సముద్రపు కెరటాలనుండి వెలువడిన |
| *కంబుబింబోకభృత్ +కన్ధరే* | స్వచ్ఛమైన శంఖము వంటి అందమైన కంఠము కలదానా... |
| *సత్కలామన్దిరే* | సర్వ శుభ గుణములకు నిలయమైన ఓ దేవీ. |
| *మన్థరే* | మెల్లగా పోవుదానా ! ( నిదానమైన, తీరికైన నడవడిక కలిగిన ఓ మాతా!) |

## దివ్యరత్నప్రభా-బంధురచ్ఛన్న- హారాదిభూషా-
## సముద్యోతమానానవద్యాంగశోభే ! శుభే !

ప్రతిపదార్థం

| | |
|---|---|
| *దివ్యరత్నప్రభా* | నీవు ధరించిన దివ్య రత్నఖచిత ఆభరణాల వెలుగులో |
| *బంధుఃరః* | మనస్సును బంధించు నిండుగా |
| *ఛన్న హార+ఆది* | ఛన్న హారము ( భుజములను కప్పు హారము), కేయూరము, అంగుళీయకము మొదలయిన |
| *భూషా* | అలంకారములతో |
| *సముద్యోతమాన* | ప్రకాశించు |
| *అనవద్య+అంగశోభే* | ప్రశంసింపదగిన ఎటువంటి దోషము లేని శరీర శోభ కలిగిన తల్లీ !*** |
| *శుభే* | శుభప్రదమైన దేవతా ! |

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

**** (జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి, అనగా పుట్టుచున్నది. ఉన్నది. వృద్ధిని పొందుచున్నది, తగ్గుటకు మార్పును చెందుచున్నది. తగ్గిపోవుచున్నది. నశించుచున్నది అను ఆరు దోషములు లేని శరీరము కలది. )*

## రత్నకేయూర-రశ్మిచ్ఛటా-పల్లవ-ప్రోల్లసత్-దోర్లతారాజితే !
## యోగిభిః పూజితే !

**ప్రతిపదార్థం**

| | |
|---|---|
| *రత్నకేయూర-రశ్మిచ్ఛటా* | రత్నాలు పొదిగిన కేయూరాల నుండి వెలువడు కిరణాల సమూహాలు |
| *పల్లవ* | లేత చిగుళ్లలా |
| *ప్ర +ఉల్లసత్* | బాగా ప్రకాశిస్తుంటే (అటువంటి) |
| *దోః +లతారాజితే* | ఎనిమిది చేతుల లతలతో విరాజిల్లు రాజశ్యామలా! |
| *యోగిభిః పూజితే* | యోగులచే పూజింపబడుదానా ! |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

## విశ్వదిఙ్మణ్డలవ్యాప్త-మాణిక్య- తేజస్స్ఫురత్-కఙ్కణాలంకృతే !
## విభ్రమాలంకృతే ! సాధుభిస్సత్కృతే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *విశ్వదిక్ +మణ్డలవ్యాప్త-* | **ఈ సృష్టి లోని అన్ని దిక్కులకూ వ్యాపించేటువంటి తేజోమయమైన** |
| *మాణిక్య* | **మాణిక్యాల** |
| *తేజస్స్ఫురత్* | **తేజస్సుచే పొదిగిన** |
| *కఙ్కణ+అలంకృతే* | **కంకణములచే( గాజులచే)అలంకరింపబడిన మాత** |
| *విభ్రమ+అలంకృతే* | **అద్భుతంగా అలంకరించబడిన ఓ తల్లీ !** |
| *సాధుభిః +సత్కృతే* | **సాధు జనులచే ( సత్యము, ధర్మము మొదలగు లక్షణములు కలవారిచే) పూజింపబడే ఓ దేవతా !** |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

## వాసరారంభవేలా-సముజ్జృంభమాణారవిన్ద-
## ప్రతిద్వన్ద్వి-పాణిద్వయే ! సంతతోద్యద్దయే ! అద్వయే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *వాసర+ఆరంభవేలా* | తెల్లవారుజామున |
| *సముజ్జృంభమాణ* | అప్పుడే వికసించిన |
| *అరవిన్ద* | తామరపువ్వుల (పద్మాల) అందంతో |
| *ప్రతిద్వన్ద్వి* | పోటీపడే |
| *పాణిద్వయే* | చేతులు గల తల్లీ! |
| *సంతత+ఉద్యత్ +దయే* | ఎల్లప్పుడూ కరుణ ఉప్పొంగే మాతా! |
| *అద్వయే* | ద్వంద్వములకు(శీతోష్ణాలు, సుఖ దుఃఖాలు మొదలైనవి) అతీతమైన తల్లీ! ( సాటిలేని తల్లీ !) |

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

## దివ్యరత్నోర్మికా-దీధితిస్తోమ-
## సంధ్యాయమానాఙ్గులీపల్లవోద్యన్నఖేన్దుప్రభామణ్డలే !
## సన్నతాఖణ్డలే ! చిత్రభామణ్డలే ! ప్రోల్లసద్కుణ్డలే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *దివ్యరత్న +ఊర్మికా-దీధితిస్తోమ* | దివ్య రత్నములు తాపిన ఉంగరముల కాంతుల సమూహాలతో అలంకరింపబడి |
| *సంధ్యాయమాన* | సంధ్యాకాలపు ఎరుపుతో |
| *అఙ్గులీపల్లవ* | నీ చిగురులవంటి వేళ్ళు ప్రకాశిస్తుంటే, |
| *ఉద్యత్ +నఖ + ఇన్దుప్రభామణ్డలే* | ఉదయించే చంద్రుని ప్రకాశముతో వెలిగే గోటి చివరలు కలిగిన తల్లీ! |
| *సన్నత+అఖణ్డలే* | ఇంద్రునిచే నమస్కరింపబడే ఓ దేవతా ! |
| *చిత్రభామణ్డలే* | చైతన్య ప్రకాశమయిన ఓ మాతా ! |
| *ప్ర +ఉల్లసత్ +కుణ్డలే* | శోభాయమానమైన కర్ణ కుండలాలతో అలంకరించబడిన ఓ దేవతా! |

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

**తారకారాజి-నీకాశ-హారావలి-స్మేర-చారుస్తనాభోగ-**
**భారానమన్మధ్యవల్లీ వలిచ్ఛేద వీచీ సముల్లాససన్దర్శితాకార-**
**సౌన్దర్య-రత్నాకరే ! వల్లకీభృత్కరే ! కిఙ్కర-శ్రీకరే !**

ప్రతిపదార్థం

| | |
|---|---|
| *తారకారాజి-నీకాశ* | నక్షత్రాలవంటి |
| *హార+ఆవలి* | దివ్యమైన మణులు కలిగిన<br>ముత్యాల హారాలతో అలంకరింపబడిన |
| *స్మేర* | వికసించిన |
| *చారుస్తన+ఆభోగ* | నీ అందమయిన విశాల కుచముల |
| *భార* | బరువు వలన |
| *ఆనమత్* | నీవు కొద్దిగా వంగినపుడు |
| *మధ్యవల్లీ* | నీ నడుముపై |
| *వలిచ్ఛేద* | ముడతలు |
| *వీచీ సముల్లాస* | అలల లాగా ఆనందము గొల్పుతుండగా |
| *సన్దర్శిత+ఆకార-* | చూడచక్కని రూపు కలిగిన |
| *సౌన్దర్య-రత్నాకరే* | అందాల సముద్రమా! |
| *వల్లకీభృత్కరే* | చేతిలో వీణను పట్టుకొని ఉన్న తల్లీ ! |
| *కిఙ్కర-శ్రీకరే* | నిన్ను సేవించే వారికి ఐశ్వర్యాన్ని ప్రసాదించే ఓ దేవతా! |

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

## హేమకుంభోపమోత్తుఙ్గవక్షోజభారావనమ్రే ! త్రిలోకావనమ్రే !

### ప్రతిపదార్థం

| | |
|---|---|
| *హేమకుంభ+ఉపమ+* | **నిండు బంగారు పాత్రల వంటి** |
| *ఉత్తుఙ్గవక్షోజభార+అవనమ్రే* | **వక్షోజాల బరువుతో  కొద్దిగా వంగి ఉన్న ఓ మాతా!** |
| | ( ప్రపంచాన్ని పోషించే సూర్య చంద్ర  రూపమైన  వక్షోజాలను ధరించి సర్వ    జగత్తుకు ప్రాణ శక్తిని ప్రసాదిస్తున్న వక్షోజాల బరువుతో కొద్దిగా వంగి ఉన్న    ఓమాతా!) |
| *త్రిలోక+అవనమ్రే* | **మూడు లోకాలచే నమస్కరింపబబడు ఓ దేవతా!** |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

### విశేషాలు

*అవనమ్రః  =  అవనతః వంగినవాడు; ఆదరించువాడు; పాదములకు నమస్కరించువాడు .*

# లసద్వృత్త-గమ్భీర నాభీసరస్తీర- శైవాల-శఙ్కాకర-
# శ్యామరోమావలీ-భూషణే ! మఞ్జు సంభాషణే !

ప్రతిపదార్థం

| | |
|---|---|
| *లసత్ +వృత్త* | ప్రకాశించు అందమైన  గుండ్రటి |
| *గమ్భీర* | లోతైన, |
| *సరః +తీర* | సరస్సు ఒడ్డున పెరిగిన |
| *శైవాల* | నాచు గడ్డి పోచలేమో |
| *శఙ్క +ఆకర* | అను  అనుమానాన్ని రేకెత్తిస్తున్న |
| *నాభీ* | నాభి చుట్టూ ఉన్న |
| *శ్యామరోమ+ఆవలీ-భూషణే* | నల్లటి వెంట్రుకలతో అలంకరించబడిన ఓ మాతా ! |
| *మఞ్జు  సంభాషణే* | రమ్యమైన వాక్కు గల ఓ దేవీ! |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

**విశేషము**

*విరాట్పురుషునికి  నాభి అంతరిక్ష స్థానం. అంతరిక్షం నుంచి వచ్చు కాంతి సముదాయం నూగారు.*
*నాభ్యాలవాల రోమాళి లతాఫల కుచద్వయీ*
*ఈ  లలితా సహస్ర  నామంలో చెప్పిన నాభి- మణిపూర చక్రస్థానాన్ని, స్తన మధ్యం - అనాహత చక్రస్థానాన్ని, స్తనాలు - ఇడా, పింగళానాడుల స్థానాన్ని సూచిస్తే, సన్నని రోమాళి – సుషుమ్నా నాడిని సూచిస్తుందని గ్రహించాలి.*
*ఈ విశేషాన్ని శ్యామలా దండకంలో కూడా సమన్వయించుకోవాలి.*

# చారుశిఞ్జత్-కటీసూత్ర- నిర్భర్త్సితానంగ-లీలాధను –
# శ్శిఞ్జినీడంబరే ! దివ్యరత్నాంబరే !

*ప్రతిపదార్థం*

*చారుశిఞ్జత్ కటీసూత్ర-* నీ అందముగా ధ్వని చేయుచున్న మొలత్రాటి గంటల శబ్దముతో

*నిర్భర్త్సిత* దూషింపబడిన ( లెక్కచేయని )

*అనంగ* మన్మథుని

*లీలాధనుః* క్రీడాధనుస్సు మీటినప్పుడు వచ్చే

*శి ఞ్జినీ* ధ్వనుల

*డంబరే* విజృంభణము కలదానా !

*దివ్యరత్న +అంబరే* దివ్యమైన రత్నాలు పొదిగిన వస్త్రాలు ధరించి ఉన్న ఓ దేవతా!

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

***విశేషాలు***

*1."మన్మథుని అందమైన వింటి ధ్వనులను సైతం లెక్కచేయని అందమైన మొలత్రాటి గంటల శబ్దము కలిగిన ఓ దేవతా " అని భావం*

*2. క్వణత్కాంచీదామా- అని శంకరులు, రణత్కింకిణీ మేఖలా అని సహస్రనామము .ఈ పద్ధతిలోనే కాళిదాసు ఈ శ్లోకంలో చారుశిఞ్జత్ కటీసూత్ర అన్నారు. 3. మన్మథునిది అల్లెతాడు.అమ్మది మొల తాడు . రెండింటిలోను తాడు ఉన్నది కనుక పోలిక .*

## పద్మరాగోల్లసన్మేఖలా-భాస్వర- శ్రోణిశోభాజిత-
## స్వర్ణభూభృత్తలే ! చన్ద్రికాశీతలే !

**ప్రతిపదార్థం**

| | |
|---|---|
| *పద్మ రాగ* | పద్మమువలె రాగము గల (అందమైనది). పద్మరాగమణులతో (కెంపులతో) |
| *ఉల్లసత్* | ప్రకాశించు చున్న |
| *మేఖలా* | వడ్డాణముతో |
| *భాస్వర-* | ప్రకాశించు ( అలంకరించబడిన) |
| *శ్రోణి* | పిరుదు భాగముయొక్క |
| *శోభా* | అందములతో |
| *జిత* | జయింపబడిన |
| *స్వర్ణభూభృత్తలే* | పసిడి పర్వతపు (మేరు పర్వతపు) విస్తారపు , అందాలు గలదానా ! |
| *చన్ద్రికాశీతలే* | చంద్రుని చల్లదనాన్ని కలిగిన తల్లీ ! (చంద్రునివలె చల్లనైన తల్లీ!) |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

**విశేషాలు**

*పసిడి పర్వతపు (మేరు పర్వతపు) వస్తారాన్ని, అందాలకంటే - అమ్మ వారి యొక్క పద్మ రాగముల వడ్డాణము కలిగిన తుంటి విస్తీర్ణము అందముగా ఉన్నదని భావం.*
*సర్వారుణా అను అమ్మ వారి నామం ఇక్కడ స్మరింపదగినది.*

## వికసిత-నవకింశుకాతామ్ర-దివ్యాంశుకచ్ఛన్న-
## చారూరుశోభా-పరాభూత- సిన్దూర-శోభాయమానేన్ద్ర
## మాతంగ-హస్తార్గలే ! వైభవానర్గలే ! శ్యామలే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *వికసిత* | వికసించిన |
| *నవకింశుకా* | నూతన కింశుక ( మోదుగు) పుష్పాల |
| *తామ్ర-* | రాగి రంగులుకల |
| *దివ్య+అంశుకచ్ఛన్న* | దివ్యమైన వస్త్రాలతో కప్పబడిన |
| *చార+ఊరుశోభా* | అందమైన నీ తొడల మెరుపుతో |
| *పరాభూత* | పరాభవింపబడిన |
| *సిన్దూర* | సింధూరపు |
| *శోభాయమాన* | శోభ కలిగిన |
| *ఇన్ద్రమాతంగ-హస్త+అర్గలే* | ఇంద్రుని ఐరావతపు తొండము యొక్క అందమును మించిపోయిన తల్లీ ! |
| *వైభవ+అనర్గలే* | ఎటువంటి ఆటంకాలూ లేని మహిమకలదానా! |
| *శ్యామలే* | ముదురు ఆకుపచ్చ, నీల వర్ణమయమైన తల్లీ! |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

***విశేషము***

*సిందూరము పూసిన ఇంద్రుని ఐరావతపు తొండము వలె, ఎర్రని మోదుగు పుష్పాల కాంతి కలిగిన దివ్యమైన చీర చాటున ఉన్న అమ్మ వారి ఊరువులు ఉన్నా యని భావం.*

## కోమలస్నిగ్ధ-నీలోత్పలోత్పాదితానంగతూణీర-
## శఙ్కాకరోదారజంఘాలతే ! చారులీలాగతే !

*ప్రతిపదార్థం*

*కోమల* మృదువైన,

*స్నిగ్ధ* నునుపైన

*నీల+ఉత్పల* నల్లకలువలతో (ఇది మన్మథుని పంచబాణములలో నొకటి.)

*ఉత్పాదిత* నింపబడిన

*అనంగ* మన్మథుని

*తూణీర* అంబుల పొది ఏమో (బాణములతో నింపబడునది.)

*శఙ్కాకర* అను శంక కలిగిస్తున్న

*ఉదార* గొప్పదైన, తిన్ననైన

*జంఘాలతే* పిక్క నుండి మోకాలు వరకు గల శరీర భాగము కలదానా !

*చారులీలాగతే* అందమైన, ఉల్లాసభరితమైన నడక కలిగిన ఓ దేవతా!

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

***విశేషము***

*అమ్ముల పొది సన్నగా ఉండి పైకి విశాలంగా ఉంటుంది. అమ్మవారి పిక్క నుండి మోకాలు వరకు గల శరీర భాగము అలా ఉన్నదని భావం.*

## నమ్రదిక్పాల-సీమన్తినీ-కున్తల--స్నిగ్ధ-నీలప్రభాపుఞ్జ-
## సఞ్జాత-దూర్వాఙ్కురాశంక- సారంగ-సంయోగ-
## రింఖన్నఖేన్దూజ్జ్వలే ! నిర్మలే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *నమ్రదిక్పాల* | నీ పాదాలకు మోకరిల్లే దిక్పాలకుల |
| *సీమన్తినీ* | భార్యల |
| *కున్తల-స్నిగ్ధ* | మృదువైన కురుల యొక్క |
| *నీలప్రభాపుఞ్జ* | నల్లని కాంతి కిరణాల సమూహమువలన |
| *-సఞ్జాత-* | పుట్టిన |
| *దూర్వ +అఙ్కుర+ఆశంక-* | గడ్డి పోచలేమో అన్న సందేహంతో దరిచేరిన |
| *సారంగ* | జింకల |
| *సంయోగ* | సంయోగముతో |
| *-రింఖత్* | ప్రకాశించే |
| *నఖ+ ఇన్దు +ఉజ్జ్వలే* | చంద్రునివంటి ప్రకాశము కలిగిన కాలిగోళ్ళు కలదానా ! |
| *నిర్మలే* | స్వచ్ఛంగా ప్రకాశించుదానా ! |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

***విశేషము***

*చంద్రునిలో లేడి ఉన్నాడను విషయం ఇక్కడ స్మరింపదగినది. (మృగాంకుడు).*
*అమ్మవారికి నమస్కరిస్తున్న మృదువైన కురులు గడ్డి పోచలేమో అన్న సందేహం కలిగిస్తుంటే అమ్మవారి పాదమనే చంద్రమండలంలో ఉన్న జింక తినటానికి బయటికి వస్తున్నదట.*
*నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా అను నామము ఇక్కడ స్మరణీయమయినది.*

## దేవ -దేవేశ-లక్ష్మీశ-భూతేశ-తోయేశ-వాణీశ-కీనాశ-దైత్యేశ-యక్షేశ-వాయ్వగ్ని-కోటీరమాణిక్య-సంఘృష్ట-బాలాతపోద్దామ-లాక్షారసారుణ్య-తారుణ్య-లక్ష్మీగృహీతాంఘ్రి పద్మే! సుపద్మే ! ఉమే !

ప్రతిపదార్థం

| | |
|---|---|
| *దేవ* | దేవతలు, |
| *దేవ +ఈశ* | ఇంద్రుడు, |
| *లక్ష్మీ +ఈశ* | విష్ణువు, |
| *భూత+ఈశ* | దివ్య శక్తుల ప్రభువు, |
| *తోయ+ఈశ* | జలాధిపతి వరుణుడు, |
| *వాణీ+ఈశ* | బ్రహ్మ, |
| *కీనాశ* | యముడు, |
| *దైత్య+ఈశ* | రాక్షసరాజు, |
| *యక్ష+ఈశ* | కుబేరుడు, |
| *వాయు+అగ్ని* | వాయువు, అగ్ని మొదలయినవారు |
| *కోటీర* | (నమస్కరించునప్పుడు ఆ) దేవతల కిరీటాలపై ఉన్న |
| *మాణిక్య* | మాణిక్యాల నుండి వచ్చేకాంతికిరణాలతో |
| *సంఘృష్ట* | ఒరుసుకొన్న |
| *బాల +ఆతప+ఉద్దామ* | ఉదయకాల సూర్యుని అడ్డంకిలేని  కాంతికిరణాలు |
| *లాక్షారస* | తమపై ఉన్న( పాదములపై) లాక్షారసమును(పారాణి) తాకినప్పుడు |
| *ఆరుణ్య* | ఎఱ్ఱదనము |
| *తారుణ్య* | యౌవనము కల |
| *లక్ష్మీ గృహీత+అంఘ్రిపద్మే* | లక్ష్మీ దేవి స్వయంగా గ్రహించు  కమలముల వంటి పాదాలు కలదానా ! ( పాదములు పద్మముల వంటివి కనుక , పద్మములలో ఉన్న లక్ష్మి అమ్మవారి సేవ చేయుచున్నదని భావం) |
| *సుపద్మే* | అందమైన కమలములాంటి ఓ దేవతా! |
| *ఉమే* | ఉమాదేవి అవతారమైన ఓ దేవీ ! (ఉం శివం మాతి మనుతే పతిత్వేన శివుణ్ణి భర్తగా తలచినది కనుక ఉమా) |

## **సురుచిర-నవరత్న-పీఠస్థితే ! సుస్థితే** !

***ప్రతిపదార్థం***

| | |
|---|---|
| *సురుచిర* | **అందమైన (మంగళకరమైన)** |
| *నవరత్న* | **తొమ్మిది మంగళకరమైన రత్నములతో** కూడుకొని ఉన్న** |
| *పీఠస్థితే* | **పీఠముపై నెలకొని ఉన్నదానా !** |
| *సుస్థితే* | **సుస్థిరమైన ఓ దేవతా!** |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

***(1.వజ్రము diamond, 2.వైడూర్యము lapis-lazuli (cat's eye.) 3. గోమేధికము agate, 4. పుష్యరాగము topaz, 5. నీలము sapphire, 6. మరకతము emerald, 7. మాణిక్యము ruby, 8. విద్రుమము coral, 9. మౌక్తికము pearl.)*

**రత్నపద్మాసనే ! రత్నసింహాసనే ! శంఖపద్మద్వయోపాశ్రితే !**
**విశ్రుతే ! తత్ర విఘ్నేశదుర్గా వటు క్షేత్రపాలైర్యుతే !**

ప్రతిపదార్థం

| | |
|---|---|
| *రత్న పద్మ +ఆసనే* | **రత్నములు పొదిగిన కమలముపై కూర్చున్న తల్లీ!** |
| *రత్న సింహ+ఆసనే* | **రత్నములు పొదిగిన సింహాసనముపై కూర్చున్న తల్లీ!** ( సింహ చిహ్నితం ఆసనమ్ సింహపు గుర్తు గల ఆసనమును సింహాసనమంటారు.) |
| *శంఖపద్మ ద్వయ+ఉపాశ్రితే* | **శంఖ నిధి,పద్మ నిధి ఆశ్రయించిన దేవతా! @** |
| *విశ్రుతే* | **మిక్కిలి ప్రసిద్ధికెక్కిన తల్లీ !** |
| *తత్ర విఘ్న +ఈశదుర్గా* | **గణేశుడు, దుర్గ, వటుక-భైరవ (భయంకరమైన ధ్వని కలవాడు. శంకరుడు; )మరియు** |
| *వటు క్షేత్రపాలైః +యుతే !* | **క్షేత్రపాల సమేతురాలైన ఓ దేవతా! ###** |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

***విశేషాలు***

@1.మహాపద్మము 2.పద్మము 3.శంఖము 4.మకరము 5.కచ్ఛపము 6.ముకుందము 7.కుందము, 8.నీలము, 9.ఖర్వము అను నవనిధులలో శంఖ నిధి,పద్మ నిధి ప్రస్తావన కవి ఇక్కడ చేస్తు న్నాడు.

### క్షేత్ర పాలకుడు అంటే ఆ క్షేత్రాన్ని పాలించేవాడు, రక్షించేవాడు అని అర్థం. ముఖ్యంగా క్షేత్రాలలోని ఆలయాలకు తప్పకుండా ఈ క్షేత్రపాలకుడు ఉంటాడు. భక్తులు తప్పనిసరిగా ఆ స్వామిని దర్శించుకోవడం క్షేత్ర నియమంగా వస్తుంది. సాధారణంగా క్షేత్రపాలకుడంటే శివుడే అని శైవాగమాలు చెప్తున్నాయి.

క్షేత్రపాలకుడు నల్లని మబ్బులవంటి శరీరవర్ణంతో.. గుండ్రటి కన్నులతో.. నగ్నంగా.. పదునైన పళ్లకోరలతో.. భ్రుకుటిని ముడిచి.. ఎర్రటి పొడవైన కేశాలతో.. శరీరంపై కపాలమాలలతో.. చేతుల్లో త్రిశూలం, కపాలం వంటి ఆయుధాలతో నిలుచుని.. భైరవవాహనంతో ఉంటాడు. కాశ్యప శిల్పశాస్త్రం ఆయన చేతులు, ధరించే ఆయుధాలను బట్టి సాత్త్విక, రాజస, తామస మూర్తులుగా విభజించింది.

క్షేత్రపాలకుడు ఆలయానికి, గ్రామానికి, క్షేత్రానికి ముఖ్యమైన దేవుడనీ, తొలుత ఆయన్నే పూజించాలని శాస్త్రోక్తి.

తిరుమల పుణ్యక్షేత్రానికి క్షేత్రపాలకుడు రుద్రుడు. ఆయన గుర్తుగా బలిపీఠానికి ఈశాన్యమూలన క్షేత్రపాలక శిలఏర్పాటు చేశారు. పూర్వ కాలంలో అర్చకులు గుడికి తాళం వేసిన తర్వాత వాటిని శిలపై పెట్టి వెళ్లేవారు. మళ్లీతెల్లవారి తాళాలు తీసుకుని తలుపులు తెరిచేవారు. ఒకసారి దీని కింద పడి బాలుడు మరణించాడని, అందువల్లేఆ శిలను గోగర్భ తీర్థానికి(పాండవ తీర్థం) తరలించినట్లు పండితులు చెబుతున్నారు. తరలించే సమయంలో ఉన్నచిన్న శిలనే ప్రస్తుతం ఉన్న క్షేత్రపాలకశిలగా చెబుతుంటారు. మహాశివరాత్రి పర్వదినాన అర్చకులు పాండవతీర్థానికి వెళ్లి అక్కడ ఏకాదశ రుద్రంతో రుద్రునికి అభిషేకం చేస్తారు.

**ఇంకొక సమన్వయం :** శ్రీ చక్రంలో ఏడవ ఆవరణ దాటి పైకి వెళుతుంటే గణేశుడు,( మనకు తెలిసిన గణపతికాడు. ఒక గణమునకు పతి) దుర్గ, వటుక-భైరవులు కనిపిస్తారు.

# మత్తమాతంగకన్యాసమూహాన్వితే!
# భైరవైరష్టభిర్వేష్టితే ! వామాదిభిః శక్తిభిః సేవితే !

*ప్రతిపదార్థం*

| | |
|---|---|
| మత్తమాతంగకన్యాసమూహ+అన్వితే | మదించిన మాతంగ కన్యల సమూహముతో కూడుకొని ఉన్నదానా! |
| *భైరవైః +అష్టభిః + వేష్టితే* | శ్రీ విద్యా చక్రంలోని ఆరవ ఆవరణలోని ఎనిమిది మంది భైరవులచే చుట్టబడినదానా ! ( సేవించబడుదానా !) |
| *వామ+ఆదిభిః శక్తిభిః సేవితే* | విద్యా చక్రంలోని అయిదవ ఆవరణలోని వామ , జ్యేష్ఠ మొదలగు శక్తులచే సేవింపబడుదానా ! |
| | ***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )** |

***విశేషాలు***

1. 'మాతంగ కన్య' అంటే అర్థం విడమరచి చెబుతాను. జాగ్రత్తగా విను! మాత అంటే తల్లి అనే అర్థం అందరికీ తెలిసినదే! 'అంగ' అంటే శరీర భాగం. కన్య అంటే పవిత్రమైనది అని అర్థం. మొత్తం కలిపి అర్థం చెప్పాలంటే, మాతకు అంగాలు ఎలా ఉండాలో అలా ఉన్న కన్య కూడా మాతే! కొంతమంది చిన్న వయసులో ఉన్న స్త్రీలను చూస్తే మనకు తల్లి అనే భావన కలుగుతుంది. షష్టి పూర్తి జరిగిన కొంతమందిని చూసినా ఆ భావం కలగదు. దానికి కారణం వారి వేషాలంకరణే! --- ( కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు)

2. 'మాతంగ కన్యల' ప్రసక్తి హరిశ్చంద్ర నాటకంలో వినబడుతుంది. విశ్వామిత్రుడు మాతంగ కన్యలను రప్పించి, హరిశ్చంద్రుడిని, ఆ కన్యలను వివాహమాడమంటాడు. అందుకు హరిశ్చంద్రుడు వినయంగా నిరాకరిస్తాడు. అక్కడ, మాతంగ కన్యలు అంటే, మతంగ మహాముని కుమార్తెలు అని అర్థం. అయితే ఈ శ్లోక పాదంలోని మాతంగ కన్యలు వీరు కారు.

1.మాతంగీ 2. సిద్ధలక్ష్మీశ్చ3. మహామాతంగికా తథా 4. మహతీ 5. సిద్ధ లక్ష్మీశ్చ శోణాధనుర్ధరాః . అని మాతంగ కన్యలు అయిదుగురు. వీరు ఎర్రని కాంతులతో ధనుర్బాణాలు ధరించి ఉంటారు. వీరంతా శ్రీ చక్రంలోని సప్తమా వరణలోని దేవతలు.

*అష్ట-భైరవులు :*

1. అసితాంగుడు, 2. సంహారభైరవుడు, 3. రురుడు, 4. కాలుడు, 5. క్రోధభైరవుడు, 6. తామ్రచూడుడు, 7. చంద్రచూడుడు, 8. మహాభైరవుడు."అసితాంగో రురుశ్చండః క్రోధ ఉన్మత్త ఏవ చ, కపాలీ భీషణశ్చైవ సంహార శ్చాష్టభైరవాః" [శివతత్త్వరత్నాకరము 3-5-11]

## ధాత్రిలక్ష్మ్యాది-శక్త్యష్టకైస్సేవితే ! మాతృకామణ్డలైర్మణ్డితే!
## యక్షగన్ధర్వ-సిద్ధాంగనామణ్డలైరర్చితే ! భైరవీసంవృతే !
## పంచబాణాత్మికే ! పంచబాణేన రత్యా చ సంభావితే!
## ప్రీతిభాజా వసన్తేన చానన్దితే !

### ప్రతిపదార్థం

| | |
|---|---|
| *ధాత్రి లక్ష్మీ +ఆ ది* | ధాత్రి లక్ష్మి మొదలయిన |
| *శక్తి +అ ష్టకైః +సేవితే* | అష్టవిధ శక్తులతో సేవింపబడుదానా ! |
| *మాతృకామణ్డలైః + మ ణ్డితే* | మాతృకాశక్తులతో సేవింపబడుదానా ! *** |
| *యక్షగన్ధర్వ-సిద్ధ+అంగనామణ్డలైః + అర్చితే* | యక్షగన్ధర్వ-సిద్ధ స్త్రీల సమూహాలతో సేవింపబడుదానా ! |
| *భైరవీసంవృతే* | భైరవీ దేవతలు చుట్టూ ఉన్నదానా ! |
| *పంచబాణ+ఆత్మికే* | అయిదు బాణాల ( ఇంద్రియాల) స్వభావం కలిగిన తల్లీ ! |
| *పంచబాణేన రత్యా చ సంభావితే* | అరవిందము, అశోకము ,చూతము , నవమల్లిక ,నీలోత్పలము అను అయిదు బాణములు కలిగిన ( ద్రావిణి, శోషిణి, బంధిని, మోహిని, ఉన్మాదిని అను అయిదు ఇంద్రియ శక్తులు కలిగిన) మన్మథునిచే, రతీదేవిచే ఆరాధించబడుదానా ! |
| *ప్రీతిభాజా వసన్తేన చ +ఆనన్దితే* | నీకు ప్రీతికరమైన వసంతుని(వసంత ఋతువు) పాటు ఆనందించే ఓ మాతా ! .. |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

### విశేషాలు

*** 1. పూర్ణోదరి, 2. విరజ, 3. శాల్మలి, 4. లోలాక్షి, 5. వర్తులాక్షి, 6. దీర్ఘనాసిక, 7. దీర్ఘముఖి, 8. గోముఖి, 9. దీర్ఘజిహ్వ, 10. అర్ధకేశి, 11. వికృతముఖి, 12. జ్వాలాముఖి, 13. ఉల్కాముఖి, 14. శ్రీముఖి, 15. విద్యాముఖి, 16. మహాకాళి, 17. సర్వసిద్ధి సమన్విత, 18. గౌరి, 19. త్రైలోక్యవిద్య, 20. మంత్రశక్తి, 21. ఆత్మశక్తి, 22. భూతిమతి, 23. లంబోదరి, 24. ద్రవిణ, 25. నగరి, 26. ఖేచరి, 27. మంజరి, 28. సురూపి, 29. విరజ, 30. కాలోదరి, 31. పూతని, 32. భద్రకాళి, 33. యోగిని, 34. శంఖిని, 35. గర్జిని, 36. కాళరాత్రి, 37. సిద్ధాస్య, 38. కపర్దిని, 39. వాఙ్మయి, 40. జయ, 41. సుముఖ, 42. మహదైశ్వర్య, 43. రేవతి, 44. మాధవి, 45. వారుణి, 46. రక్షోవధారి, 47. సహజ, 48. లక్ష్మి, 49. వ్యాపిని, 50. మాయాన్విత అను మాతృకాశక్తులతో సేవింపబడుదానా !

## భక్తిభాజాం పరం శ్రేయసే కల్పసే ! యోగినాం మానస- ద్యోతసే ! ఛన్దసామోజసే భ్రాజసే! గీతవిద్యాతి తృష్ణేన కృష్ణేన సంపూజ్యసే! భక్తిమచ్చేతసా వేధసా స్తూయసే ! విశ్వహృద్యేన వాద్యేన విద్యాధరైర్గీయసే !

ప్రతిపదార్థం

| | |
|---|---|
| *భక్తిభాజాం* | నీ పట్ల భక్తి ఉన్నవారికి |
| *పరం శ్రేయసే కల్పసే* | అత్యంత శ్రేయస్సును( మోక్షాన్ని) కలిగించే ఓ దేవతా! |
| *యోగినాం మానసే ద్యోతసే* | యోగుల మనస్సులో కనబడే తల్లీ ! |
| *ఛన్దసామ్ +ఓజసే భ్రాజసే* | సకల వేదాల శోభతో ప్రకాశించే తల్లీ ! (గాయత్రీ ఛందస్సులోని ఓజస్సు, అనగా జ్ఞానేంద్రియ పటిమ , బలములతో ప్రకాశించే తల్లీ !) |
| *గీతవిద్యా+అతితృష్ణేన* | సంగీత విద్యలను( బ్రహ్మ విద్య, భగవద్గీతా విద్య, వేణునాద విద్యలను) అమితంగా ఇష్టపడే |
| *కృష్ణేన* | కృష్ణునితో |
| *సంపూజ్యసే* | పూజింపబడే తల్లీ ! |
| *భ క్తిమ త్ + చేతసా* | భక్తి కలిగిన మనస్సు కలిగిన |
| *వేధసా* | బ్రహ్మతో |
| *స్తూయసే* | కీర్తింపబడుదానా ! |
| *విశ్వహృద్యేన* | అందరి హృదయాలను మంత్రముగ్ధులను చేసే |
| *వాద్యేన* | తమ వాయిద్యాలతో |
| *విద్యాధరైః +గీ యసే* | విద్యాధరులచే గానం చేయబడు ఓ దేవీ! |

***జయ !*** = జయింపుము ! ( ప్రకాశించుము ! )

**శ్రవణహరణ-దక్షిణక్వాణయా వీణయా కిన్నరైర్గీయసే !**
**యక్షగన్ధర్వసిద్ధాంగనామణ్డలైరర్చ్యసే !**
**సర్వసౌభాగ్యవాఞ్ఛావతీభిర్వధూభిస్సురాణాం సమారాధ్యసే !**

### *ప్రతిపదార్థం*

| | |
|---|---|
| *శ్రవణహరణ-దక్షిణక్వాణయా* | **విన్నవారి చెవులను మోహింపచేయగలిగిన** |
| *కిన్నరైః వీణయా* | **కిన్నరుల వీణలచే** |
| *గీయసే* | **స్తుతింపబడు ఓ తల్లీ!** |
| *యక్షగన్ధర్వసిద్ధ+అంగనామణ్డలైః* | **యక్ష, గంధర్వ, సిద్ధుల సమూహాలచే స్తుతింపబడే** |
| *+అర్చ్యసే* | **తల్లీ!** |
| *సర్వసౌభాగ్యవాఞ్ఛావతీభిః* | **సకల సౌభాగ్యాలను కోరు** |
| *సురాణాం వధూభిః* | **సురుల భార్యలచే** |
| *సమారాధ్యసే* | **పూజింపబడే తల్లీ!** |

***జయ !*** = **జయింపుము ! ( ప్రకాశించుము ! )**

### *విశేషాలు*

కిన్నరులు : దేవతాభేదము. వీరు అశ్వముఖమును నరశరీరమును కలవారు.

యక్షులు: కశ్యపునికి సురసయందు పుట్టిన వారు. కుబేరాదులు

గంధర్వులు: దేవలోకమునందు గానముచేయు ఒక తెగ దేవతలు.కశ్యపునికి ప్రాధయందు పుట్టినవారు (హాహాహూహూ మొదలయినవారు).

# శ్యామలాదండకపు నిత్యార్చన

## సర్వవిద్యావిశేషాత్మకం । చాటుగాథాసముచ్చారణం । కణ్ఠమూలోల్లసద్వర్ణరాజిత్రయం । కోమలశ్యామలోదార- పక్షద్వయం । తుణ్డశోభాతిదూరీ-భవత్కింశుకం । తం శుకం లాలయన్తీ పరిక్రీడసే ।

ప్రతిపదార్థం

| | |
|---|---|
| సర్వవిద్యావిశేష+ఆత్మ కం | అన్ని విద్యలయొక్క విశేషమైనటువంటి స్వరూపమైన, |
| చాటుగాథాసముచ్చారణం | నేర్పరితనంతో సృష్టి రహస్యాలన్నింటినీ పలుకగలిగిన |
| కణ్ఠమూల+ఉల్లసత్ ర్ణరాజిత్రయం | కంఠం దిగువన మూడు అందమైన రంగుల రేఖలు కలిగిన |
| కోమలశ్యామల+ఉదారపక్షద్వయం | రెండు విశాలమైన కోమలమైన, ఆకుపచ్చని లేత రెక్కలుకలిగిన |
| తుణ్డశోభ +అతిదూరీభవత్ | కింశుక పుష్పం( ఎర్రని మోదుగు పువ్వు ) యొక్క కాంతిని ఓడించు |
| +కింశుకం | ఎర్రటి ముక్కు కలిగిన |
| తం శుకం | ఆ రామ చిలుకను |
| లాలయన్తీ | లాలిస్తూ( ముద్దాడుతూ) |
| పరిక్రీడసే | ఆనందించెడి తల్లీ ! |

విశేషాలు

చిలకను, వీణను ధరించి భండాసురుని పైకి శ్యామలాదేవి యుద్ధానికి బయలుదేరిందట. చిలకను, వీణను, యక్షి ణీ, మంత్రిణి అను పరిచారికలు మోస్తుండగా, చిత్ర జీవము అను ధనుస్సుతో శ్యామలాదేవి భండాసురునితో యుద్ధం చేసింది.

# ఫలశ్రుతి

**పాణిపద్మద్వయేనాక్షమాలామపిస్ఫాటికీం జ్ఞానసారాత్మకం**
**పుస్తకం చాఙ్కుశం పాశమాబిభ్రతీ యేన సఞ్చిన్త్యసే**
**తస్య వక్త్రాన్తరాత్ గద్యపద్యాత్మికా భారతీ నిస్సరేత్ ।**
**యేన వా   యావకాభాకృతి ర్భావ్యసే**
**తస్య వశ్యా భవన్తి స్త్రియః పూరుషాః**

ప్రతిపదార్థం

| | |
|---|---|
| పాణిపద్మ ద్వయేన | పద్మములవంటి  రెండు చేతులలో |
| స్ఫాటికీం | స్వచ్ఛమైన మెరిసే  స్ఫటికములతో కూడిన |
| అ క్షమాలామ్ | జ ప మాలను, |
| అపి | మరియు |
| జ్ఞానసార+ఆత్మ కం | సమస్త జ్ఞాన సారాన్ని  - కలిగి ఉన్న |
| పుస్తకం | పుస్తకాన్ని ధరించి, |
| చ | మరియు |
| అఙ్కు శం | ఏనుగు కుంభస్థలమునందు పొ డిచెడి ఆయుధమును |
| పాశమ్ | తాడును |
| ఆ బిభ్రతీ | ధరించి ఉన్న ఈ నీ రూపంలో |

| | |
|---|---|
| యేన | ఎవని చేత |
| సఞ్చిన్త్యసే | ధ్యానించబడతావో |
| తస్య | అతనియొక్క |
| వక్త్ర +అ న్తరాత్ | కంఠము నుండి |
| గద్యపద్య+ఆ త్మికా | గద్యము, పద్యము రెండింటిరూపంలో |
| భారతీ | సరస్వతీ దేవి |
| నిస్సరేత్ | ప్రవహిస్తుంది. |
| యేన వా | ఎవరిచేత |
| యావక+ఆభా +ఆకృతిః | ఎర్రని కాంతివంతమైన శరీరంతో |
| భా వ్యసే | భావింపబడతావో |
| తస్య | అతనికి |
| స్త్రియః పూరుషాః | స్త్రీలు, పురుషులు( సమస్త జగత్తు) |
| వశ్యా భవన్తి | వశమౌతారు. |

## కిం న సిద్ధ్యేద్వపుః శ్యామలం కోమలం
## చన్ద్రచూడాన్వితం తావకం ధ్యాయతః
## తస్య లీలాసరోవారిధిః తస్య కేలీవనం నన్దనం,
## తస్య భద్రాసనం భూతలం, తస్య వాగ్దేవతా కిఙ్కరీ,
## తస్య చాజ్ఞాకరీ శ్రీ స్వయమ్

### ప్రతిపదార్థం

| | |
|---|---|
| *తావకం* | నీయొక్క |
| *శ్యామలం* | నల్లని, (ఆకుపచ్చని) |
| *కోమలం* | మృదువైన |
| *చన్ద్రచూడ +అన్వితం* | నెలవంకను కిరీటమున ధరించిన |
| *వపుః* | రూపమును |
| *ధ్యాయతః* | ధ్యానించు వారికి |
| *కిం న సిద్ధ్యేత్* | సిద్ధిం చనిది ఏమున్నది? |
| *తస్య* | తనకు( శ్యామలాదేవిని ధ్యానించువానికి) |
| *వారిధిః* | సముద్రము |
| *లీలాసరః* | ఈతలాడు ఒక చిన్న కొలనుగా మారిపోతుంది. |
| | ( ప్రతికూలతలు అనుకూలతలుగా మారతాయి) |
| *తస్య* | శ్యామలాదేవిని ధ్యానించువానికి |
| *నన్దనం* | ఇంద్రుని ఉద్యానవనము |
| *కేలీవనం* | ఆటలతోట ( స్వర్గాది సుఖములు సులభంగా లభిస్తాయి) |

*తస్య* శ్యామలాదేవిని ధ్యానించువానికి

*భూతలం* ఈ భూమి ( ఎత్తు పల్లాల భూమి)

*భద్ర+ఆసనం* 1. రాజు కూర్చునే సింహాసనం అవుతుంది.

2. యోగ విద్యలో ఒక ఆసనం అవుతుంది ***

*తస్య* శ్యామలాదేవిని ధ్యానించువానికి

*వాగ్దేవతా* వాక్కులకు దేవత అయిన సరస్వతి

*కిఙ్కరీ* దాసి ( అనగా చదువు బాగా వస్తుందని భావం)

*చ* మరియు

*తస్య* శ్యామలాదేవిని ధ్యానించువానికి

*శ్రీ* లక్ష్మీదేవి

*స్వయమ్* స్వయముగా

*ఆ జ్ఞాకరీ* ఆజ్ఞలను పాటిస్తుంది.(అనగా సంపదలు సిద్ధిస్తాయని భావం)

*** (మోకాళ్ల వద్ద కాళ్లను మడత వేసి, కుడి మడమ కుడి పిరుదు క్రిందికీ, ఎడమ మడమ ఎడమ పిరుదు క్రిందికీ వచ్చే విధంగా కూర్చోవడం భద్రాసనం. మొత్తం మీద అమ్మని ధ్యానించేవాడు ద్వంద్వాతీత స్థితికి వెళతాడని భావం)

# సర్వతీర్థాత్మికే ! సర్వమన్త్రాత్మికే !

*ప్రతిపదార్థం*

*సర్వతీర్థ+ఆత్మికే* సర్వతీర్థముల స్వభావము నీవే అయిన తల్లీ !
( మహర్షులు స్నానాదులు చేసిన నదీతటాకాది
పుణ్యోదకమును తీర్థమంటారు)
*సర్వమన్త్ర +ఆ త్మికే* సర్వ మన్త్రముల స్వభావము నీవే అయిన తల్లీ!

***విశేషాలు***

రక్షింపజేసేదనీ, తరింపజేసేదనీ మంత్రం పదానికి అర్థాలు ఉన్నాయి. మంతారం త్రాత యితి మంత్రం.
అందులో బీజమంత్రాలను గురించి "శ్రీశక్తిగీత" వ్యాఖ్యాన గ్రంథానికి శ్రీలక్ష్మీ కాంతయోగి
ఇలా తెలుగు అనువాదంలో వివరించారు. "బీజ మంత్రాలు ప్రథమతః మూడున్నూ, ద్వితీయతః
ఎనిమిదిన్నీ కలవు. గురు బీజం, శక్తి బీజం, రమా బీజం, కామ బీజం, యోగ బీజం, తేజ బీజం,
శాంతి బీజం, రక్షా బీజం.
కకార, లకార, ఈకార, మకార సంపుటితమైన బీజం (క్లీం) "కామ బీజం".
కకార, రకార, ఈకార, మకార సంయోగం (క్రీం) "యోగ బీజం".
అకార, ఏ(ఐ)కార, మకారాలు కలసినవి గురుబీజం (ఐం).
హకార, రకార, ఈకార, మకారాలతో ఏర్పడినది శక్తి బీజం (హ్రీం).
శకార, రకార, ఈకార, మకారాల కలసినది (శ్రీం) రమా బీజం.
టకార, రకార, ఈకార, మకారాలు కూడినది (ట్రీం) తేజ బీజం.
సకార, తకార, రకార, ఈకార, మకారాల సంయోగం (స్త్రీం) శాంతి బీజం.
(హకార, రకార, ఈకార, మకారాలు కలసిన) హ్రీం రక్షాబీజం.
కారణ బ్రహ్మ స్వరూపునకు అష్టవిధ ప్రకృతులు కలిగి తద్వారా కార్య బ్రహ్మ స్వరూపం కలిగినట్లే శబ్దబ్రహ్మ
స్వరూపానికి ఈ అష్టవిధ బీజాలు అష్టవిధ ప్రకృతులై మంత్ర సృష్టికి కారణాలైనాయి.
మంత్రాలలో చిన్నవి పెద్దవి చాలా ఉన్నాయి.
గాయత్రిలో 24 అక్షరాలు ఉన్నాయి.
ఆరు అక్షరాలు ఉన్న మంత్రాన్ని "బాల" అంటారు.
పన్నెండు అక్షరాల మంత్రం కౌమారి.
పదిహేను అక్షరాల మంత్రం యౌవని.
ఇరవై నాలుగు అక్షరాల మంత్రం "వృద్ధ".
ఇంకా చాలా అక్షరాలు, అంటే మితి లేకుండా అక్షరాలు ఉంటే
"మాలా" మంత్రం అంటారు.

# సర్వ యన్త్రాత్మికే

*సర్వయన్త్ర+ఆత్మికే* **సర్వ యన్త్రముల స్వభావము నీవే అయిన తల్లీ !**

***విశేషాలు***

యంత్రం అంటే బీజాక్షరాలు, చిహ్నాలు కలిగిన ఒక ఫలకం.

బీజాక్షరాలతో కూడిన చక్రం. సరళరేఖలు, త్రిభుజాలు, బహుభుజాలు, వృత్తాలు, కోణాలతో రూపొందించిన చిత్రాలలో బీజాక్షరాలు ఉంటాయి. ఇవన్నీ రాగిరేకుపై లిఖించి ఉంటాయి. దేవాలయాలలో విగ్రహప్రతిష్ఠ జరిగేటప్పుడు విధిగా విగ్రహపీఠం దిగువన యంత్రం ఉంటుంది. ఏ దేవత విగ్రహ ప్రతిష్ఠ జరుగుతున్నదో ఆ దేవతకు సంబంధించిన బీజాక్షరాలు అందులో ఉంటాయి. ఇదిగాక మంత్ర, తంత్రశాస్త్ర గ్రంథాలలో "శాంతి, వశ్యం, స్తంభనం, ఉచ్చాదనం, విశ్వేషణం, మారణం" అనే ఆరు ప్రయోజనాలకోసం మంత్రాలు, యంత్రాలు వేర్వేరుగా ఉన్నాయి. యంత్రం చుట్టూ భూపురం ఉంటుంది. భూపురం అంటే నాలుగ ప్రధాన దిక్కులలో ద్వారా కలిగిన నలుచదరపు గోడ. యంత్రం మధ్య (మంత్ర) బీజం, ఎనిమిది దిక్కులలో లం, రం, హం, షం, వం, యం, సం, శం అనే బీజాక్షరాలను తూర్పు దిక్కు మొదలుగా వ్రాస్తారు. (సిద్ధేశ్వరనంద భారతిస్వామి)

# సర్వ తన్త్రాత్మికే !

సర్వతన్త్ర+ఆత్మికే  సర్వ తంత్రముల స్వభావము నీవే అయిన తల్లీ !

***విశేషాలు***

స్వతంత్రం లాంటి పదాలలో తంత్రం అంటే మరొకరి ప్రమేయం లేకుండా సొంతంగా వ్యవహరించడం అనే అర్థం ఉంది. పంచ తంత్రం అనే శబ్దంలో తంత్రం అంటే ఒక నీతి అని అర్థం. ఇవిగాక, సిద్ధాంతం, కుటుంబ భరణ వ్యవహారం, శపథం, ప్రధానాంశం, పూర్వ మీమాంసా శాస్త్రం మొదలైన సుమారు ఇరవై అర్థాలు ఉన్నాయి. వీటన్నింటికి మించి, దేవతలను, ప్రకృతి శక్తులను వశం చేసుకొనడానికి ఉద్దేశించిన మంత్రాలు, చక్రాలు మొదలైన వాటితో కూడిన తంత్ర శాస్త్రం మరొకటి ఉంది. దేవతలను వశం కావించుకొనడానికి చేసే కర్మకాండను వివరించే సాహిత్యం వైదిక, బౌద్ధాది మతాల వాఙ్మయంలో చాలా ఉంది.

- శ్రీ శంకర భగవత్పాదులు రచించిన సౌందర్య లహరి (వ్యాఖ్యాన సహిత) గ్రంథానికి శ్రీ చదలువాడ జయరామ శాస్త్రి ఆంధ్ర టీకా తాత్పర్య గ్రంథంలో తంత్రవిద్యల పేర్లను ఇచ్చారు. అవి: 1. మహామాయా శంబరం, 2. యోగినీ జాల శంబరం, 3. తత్త్వ శంబరం, 4. భైరవాష్టకం, 5. బహు రూపాష్టకం, 6. యమళాష్టకం, 7. చంద్ర జ్ఞానం, 8. మాలిని, 9.మహా సమ్మోహనం, 10. వామ జుష్టం, 11. మహా దేవం, 12. వాతులం, 13. వాతులోత్తరం, 14. హృద్భేదం, 15. తంత్ర భేదం, 16. గుహ్య తంత్రం, 17. కామికం, 18. కలావాదం, 19. కలా సారం, 20. కుండికా మతం, 21. మతోత్తరం, 22. వీణాఖ్యం, 23. త్రోతలం, 24. త్రోత లోత్తరం, 25. పంచామృతం, 26. రూప భేదం, 27. భూతోడ్డామరం, 28. కులసారం, 29. కులోద్దేశం, 30. కుల చూడామణి, 31. సర్వ జ్ఞానోత్తరం, 32. మహాకాళీ మతం, 33. అరుణేశం, 34. మోదినీశం, 35. వికుంఠేశ్వరం, 36. పూర్వ పశ్చిమ దక్షం, 37. ఉత్తరం, 38.నిరుత్తరం, 39. విమలం, 40. విమలోత్థం, 41. దేవీ మతం. మిగతా 23 తంత్రాలు ఇందులోనే ఇమిడి ఉన్నాయని జయరామ శాస్త్రి వ్రాశారు.

# సర్వశక్త్యాత్మికే !

*సర్వశక్తి +ఆత్మికే* **సర్వ శక్తుల స్వభావము నీవే అయిన తల్లీ !**

***విశేషాలు***

·పదిమంది శక్తులు : 1. సర్వ సిద్ధిప్రద, 2. సర్వ సంపత్ప్రద, 3. సర్వ ప్రియంకరి, 4. సర్వ మంగళకారిణి, 5. సర్వ కామప్రద, 6. సర్వ దుఃఖమోచిని, 7. సర్వ మృత్యు ప్రశమని, 8. సర్వ విఘ్న నివారిణి, 9. సర్వాంగ సుందరి, 10. సర్వ సౌభాగ్య దాయిని.

·సర్వ సిద్ధిప్రద మొదలైన పదిమంది పట్టికగాక శక్తులుగా భావించే మరో ఎనమండుగురి పేర్లివి :

1. వశిని, 2. కామేశ్వరి, 3. మోదిని, 4. విమల, 5. అరుణ, 6. జయిని, 7. సర్వేశ్వరి, 8. కౌలిని.

# సర్వపీఠాత్మికే !

*సర్వపీఠ +ఆత్మికే* **సర్వ పీఠముల( పునాది స్థానములలో) స్వభావము నీవే అయిన తల్లీ !**

# సర్వవేదాత్మికే !

*సర్వవేద +ఆత్మికే* **సర్వ వేదముల స్వభావము నీవే అయిన తల్లీ !**

***విశేషాలు***

1.వేదములు నాలుగు. - ఋక్కు, యజుస్సు, సామము, అధర్వము

- మంత్ర బ్రాహ్మణాత్మకమైన శబ్దరాశి వేదం. ఇది అపౌరుషేయమని భారతీయులు అనాదిగా నమ్మారు. ఋక్, యజుస్, సామ, అథర్వణ వేదాలని వేద విభజన జరిగింది. ఋక్, యజుస్, సామ వేదాలను వేదత్రయి అని వ్యవహరించడం పరిపాటి. అథర్వణ వేద మంత్రాలుగా ప్రచారంలో ఉన్న మంత్రాలు తరువాత ఎప్పుడో వచ్చి చేరినవని ఒక వాదం ఉంది. మొదటినుంచి ఉంటేనే దానికి వేద ప్రతిపత్తి కనుక మొదటి నుంచి ఉన్నవనే అనుకోవాలి.
- 2. వేదయ తీతి వేదః. తెలియజేసేది గనుక వేదం.
- 3. ప్రత్యక్షేణాను మిత్యావాయ స్తూపాయోన బుధ్యతే/ ఏతం విదన్తి వేదేన తస్మాత్ వేదస్య వేదతా// ప్రత్యక్షం అనుమానం లాంటి ప్రమాణాల చేత తెలియడానికి వీలు కానిది వేదం.
- 4. విద్ అనే ధాతువు నుంచి వచ్చిన పదం వేదం.
- 5. ‘‘స్వయం సర్వం వేత్తితి వేదః’’ అని మరొక నిర్వచనం ఉంది. సర్వజ్ఞత్వం కలదని భావం.
- 5. అపౌరుషేయ శాస్త్ర జ్ఞానం.
- 6. విధి, మంత్రం, నామధేయం, నిషేధం, అర్థవాదం అనేవి స్వరూపంగా కలది.

ఋక్‌వేదము:- 1017 వేదమంత్రములసంహితము, వేదము లన్నిటిలోను పురాతనమైనది, ఋక్ వేదమంత్రములకు పారశీక (ఇరానియనుల ధర్మగ్రంథమయిన) ధ్యానశ్లోకములకు సన్నిహిత సంబంధము గలదు. సామవేదము:-వేదమంత్రములకు స్వరములు కల్పించి గానరూపమును చూపు సంహిత. యజుర్వేదము: - వైదిక తంత్రములను గురించి చెప్పు సంహిత. అధర్వణవేదము:- వేదసంహితలలో చివరిది. ఈ సంహిత భూత ప్రేత మంత్రములతోను చారిత్రక విషయములతోను కూడి యున్నది.)

## సర్వవిద్యాత్మికే!

*సర్వవిద్య +ఆత్మికే* **సర్వ విద్యల స్వభావము నీవే అయిన తల్లీ !**

***విశేషాలు***

- ఒక పద్ధతిలో చతుర్దశ విద్యలు. అవి : వేదాలు నాలుగు, వేదాంగాలు ఆరు, పురాణం, న్యాయశాస్త్రం, మీమాంసాశాస్త్రం, ధర్మశాస్త్రం మొత్తం పద్నాలుగు. వీటికి నాలుగు ఉపవేదాలు (అయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వవేదం, అర్థశాస్త్రం) కలుపుకొంటే అష్టాదశ విద్యలు.

## సర్వయోగాత్మికే !

*సర్వయోగ +ఆత్మికే* **సర్వ యోగముల స్వభావము నీవే అయిన తల్లీ !**

***విశేషాలు***

*ద్వివిధ-యోగములు :*

·1. సగుణ యోగము, 2. నిర్గుణ యోగము.

*త్రివిధ-యోగములు :*

·(అ.) 1. కర్మయోగము, 2. భక్తియోగము, 3. జ్ఞాన యోగము.

·(ఆ.) 1. కాలయోగము, 2. దైవయోగము, 3. ప్రారబ్ధయోగము.

*చతుర్విధ యోగములు :*

·(అ.) 1. అష్టాంగయోగము, 2. కర్మయోగము, 3. భక్తియోగము, 4. జ్ఞానయోగము.

·(ఆ.) 1. మంత్రయోగము, 2. హఠయోగము, 3. లయయోగము, 4. రాజయోగము.

## సర్వవర్ణాత్మికే !

*సర్వవర్ణ +ఆత్మికే* **సర్వ వర్ణముల(అక్షరముల) స్వభావము నీవే అయిన తల్లీ !**

# సర్వనాదాత్మికే!

*సర్వనాద +ఆత్మికే* **సర్వ నాదముల స్వభావము నీవే అయిన తల్లీ !**

***విశేషాలు***

ప్రాణవాయువు నాడుల యందు సంచరించుటవలనఁ గలిగిన ధ్వని. నాదం

*పంచవిధ-నాదములు :*

·1. అతిసూక్ష్మము, 2. సూక్ష్మము, 3. పుష్టము, 4. అపుష్టము, 5. కృత్రిమము.

*దశ-నాదములు :*

·(అ.) 1. చిణి, 2. చిణిచిణి, 3. శంఖనాదము, 4. వేణునాదము, 5. వీణానాదము, 6. తాళనాదము, 7. ఘంటానాదము, 8. భేరీనాదము, 9. మృదంగనాదము, 10. మేఘనాదము.

·(ఆ.) 1. జలనాదము, 2. భేరీనాదము, 3. మృదంగనాదము, 4. ఘంటానాదము, 5. కాహళనాదము, 6. కింకిణీనాదము, 7. వేణునాదము, 8. భ్రమరనాదము, 9. ఓంకారనాదము, 10. శంఖనాదము.

# సర్వశబ్దాత్మికే !

*సర్వశబ్ద +ఆత్మికే* **సర్వ శబ్దముల స్వభావము నీవే అయిన తల్లీ !**

***విశేషాలు***

*ద్వివిధ-శబ్దము :*

·1. శ్రావణము (ధ్వనిరూపము), 2. చాక్షుషము (వర్ణరూపము).

*"స ద్వివిధః ధ్వన్యాత్మకో వర్ణాత్మకశ్చ " [తర్కసంగ్రహము]*

*త్రివిధ-శబ్దములు :* (అ.) 1. వాచకము, 2. లక్షణము, 3. వ్యంజకము.

*"వాచక లక్షక వ్యంజకత్వేన త్రివిధం శబ్దజాతమ్" [ప్రతాపరుద్రీయము]*

·(ఆ.) 1. సంయోగజము, 2. విభాగజము, 3. శబ్దజము.

*పంచ-శబ్దములు*

·1. సూత్రము, 2. వార్తికము, 3. భాష్యము, 4. కోశము, 5. కవి ప్రయోగము.

# సర్వదీక్షాత్మికే!

*సర్వదీక్ష +ఆత్మికే* **సర్వ దీక్షల స్వభావము నీవే అయిన తల్లీ !**

***విశేషాలు***

'దీ' అంటే దివ్యభావాన్ని ఇచ్చేదనీ, 'క్ష' అంటే సమస్త పాపాలను క్షాళనం చేసేదనీ అంటారు.
దీక్షా త్రయమనీ, సప్త దీక్షలనీ ఉన్నాయి. సప్త దీక్షలు ఇవీ: క్రియాదీక్ష, వర్ణ దీక్ష, కళాదీక్ష, స్పర్శదీక్ష, వాగ్దీక్ష, దృగ్దీక్ష, మనోదీక్ష
*త్రివిధ-దీక్షలు :* (అ.) 1. వేధాదీక్ష, 2. క్రియాదీక్ష, 3. మంత్రదీక్ష.
·(ఆ.) 1. స్పర్శదీక్ష (కమఠదీక్ష), 2. మత్స్యదీక్ష (చాక్షుషదీక్ష), 3. స్మరణ దీక్ష.
*"సా దీక్షా త్రివిధా ప్రోక్తా శివాగమవిశారదైః, వేధారూపా క్రియారూపా మంత్రరూపా చ తాపస" [సి.శి.]*

# సర్వముద్రాత్మికే !

*సర్వముద్ర +ఆత్మికే* **సర్వ ముద్రల స్వభావము నీవే అయిన తల్లీ !**

***విశేషాలు***

సంధ్యావందనంలో గాయత్రిని ధ్యానం చేసి గాయత్రి మంత్ర పఠనానికి ముందు, తరువాత ముద్రలను వేయడం/ ప్రదర్శించడం విధి. చేతిని, చేతి వ్రేళ్ళను ఉపయోగిస్తూ సంధ్యావందనానికి ముందుగా ప్రదర్శించే ముద్రలను పూర్వ ముద్రలనీ, తరువాత ప్రదర్శించే ముద్రలను ఉత్తర ముద్రలనీ అంటారు.
పూర్వ ముద్రలు 24 ఇవీ (మూడు శ్లోకాలలో) : సముఖం(1), సంపుటం (2), (చైవ) వితతం(3), విస్తృతం (4) తథా/ ద్విముఖం (5), త్రిముఖం (6) చైవ, చతుః(7), పంచముఖం (8)
తథా/ షణ్ముఖో (9) (అ)ధోముఖం (10) చైవ, వ్యాపకాఞ్జలికం (11), తథా/ శకటం (12), యమపాశం (13) చ, గ్రథితం (14), సమ్ముఖోన్ముఖం (15)// ప్రలమ్బం (16), ముష్టికం (17) చైవ, మత్స్యః (18), కూర్మో (19), వరాహకమ్ (20)/ సింహక్రాన్తం (21), మహాక్రాన్తం (22), ముద్గరం (23), పల్లవం (24) తథా.//
ఉత్తర ముద్రలు ఎనిమిది మాత్రమే ఉన్నాయి. అవి ఒక శ్లోకంలో : సురభిః(1), జ్ఞాన (2), చక్రే (3) చ, యోనిః (4), కూర్మో (5) (అ) థ పఙ్కజః (6) లిఙ్గం (7), నిర్వాణ (8), ముద్రాః ప్రకీర్తితాః.
ఖేచరీ, భూచరీమొదలైన ముద్రలువేరు.
*చతుర్విధ ముద్రలు :* 1. ఖేచరి, 2. భూచరి, 3. చాచరి, 4. అగోచరి.

## సర్వ సర్వాత్మికే !
**అన్ని పూర్ణత్వముల స్వభావము నీవే అయిన తల్లీ !**

## సర్వగే !
**అంతటా వ్యాపించిన ఓ తల్లీ !**

## సర్వరూపే !
**అన్ని రూపాలు నీవే అయిన ఓ తల్లీ**

## హే జగన్మాతృకే!
**ఓ జగత్తులకు తల్లి అయినదానా !**

***విశేషాలు***

- స్వర్గమర్త్యపాతాళములు. (భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహాలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము - ఈయేడును ఊర్ధ్వలోకములు. అతలము, వితలము, సుతలము, రసాతలము, మహాతలము, తలాతలము, పాతాళము - ఈ యేడును అధోలోకములు.)

## పాహి మాం ! పాహి మాం ! పాహి మాం !

**నన్ను రక్షించు ! నన్ను రక్షించు ! నన్ను రక్షించు !**

## దేవి తుభ్యం నమో, దేవి తుభ్యం నమో, దేవి తుభ్యం నమః

**ఓ దేవీ ! నీకు నమస్కారములు**
**ఓ దేవీ ! నీకు నమస్కారములు**
**ఓ దేవీ ! నీకు నమస్కారములు**

